క॥ నాకును నిట్టులె నీకృప, నా కల్యాణాదిప్రాప్తిఁ ♦ డా భగవంతుం
డా కైలాసనివాసుం, డా కారుణికుండు కనుల ♦ కగుపట్టునొకో! 31

క॥ అనిన విని మౌని యనియెను, వనజేక్షణ! సందియంబు ♦ వల దిక సచిరం
బున నే యాఱవమాసం, బునఁ జూడఁగఁగలవు శివుని ♦ భూతశరణ్యున్. 32

గీ॥ ఆ శివునిచేత మఱి తదీ♦యార్ధమూర్తి
యైన జగదంబచేతఁ బ♦డాలు వరము
లొందఁగల విది నిజము ము♦కుంద! సర్వ
కాలవృత్తములఁ గాంతు ము♦క్కంటికృపను. 33

క॥ పెక్కులకు వరములిచ్చిన, యక్కాయణికాంతిరంగుఁ ♦ డనఘుఁడు నీకుం
దెక్కతన సుప్రసాదము, నక్కజముగఁ జేయకుండు? ♦ నంబుజనేత్రా! 34

క॥ దేవతలును నిను మెచ్చెద, రీవును బ్రహ్మాదులకును ♦ పూజ్యుఁడ వహా! రా
జీవవిలోచన! జప్యము, నే పేగన్ జెప్పుదు శివుఁ గ♦నెన నద్భుతాన్.  35

గీ॥ అనినఁ దామరసాక్షుఁడు ♦ హాయనమొంది, యనియెముమహాసింధు! నీవు ది♦వ్యప్రసాద
మునదనుజసూదనునిఁగ్రతు♦భుగ్విభునిఁగ, నిరుదసోంగుము సద్విద్య♦నీవుసయను.

— * ఉపమన్యుఁడు శ్రీకృష్ణునకు శైవదీక్ష నిచ్చుట * —

వ. ఇట్లు మహాదేవాశ్రితకథలతో నేఁడుదినంబులు మునిపుంగవుండు గడిపి యుని
మిదవదినంబున నుపమన్యుండు శ్రీకృష్ణుని యథావిధి గంగాజలావగాహనంబుఁ జేయించి
దండకమండలుకుశ మేఖలా చర్మవసనంబు లొసంగి పాశుపతదీక్షనిచ్చి బ్రహ్మవిద్య
నుపదేశించె ననంతరంబున నచ్యుతుండు తపమొనరిచి మొదటి మాసమును ఫలము
ఫలాహారంబునఁ గడపి రెండవ నెలనుండి సలిలాశనం బేయొనరించుచు నేకపాదం
బున నిలిచి యూర్ధ్వబాహుండై నిష్ఠం దప్రమతిఁ దపించు చుండ నైదు నెలలుగడచి
యాఱవ నెల జరుగుచున్నంత నొక్కనాఁడు.

గీ। ఆకసమునందు సూర్యస♦హస్రతేజ, మగుపడియె సమ్మునిమధ్య♦మంద మెఱసు
దీవియంబోలు కిటికిలఁ ♦ దీర్చియుండ, శక్రచాపకృతాంతము ♦ శైలమొప్పు.

— * శ్రీకృష్ణుతపంబుమెచ్చి పార్వతీపరమేశ్వరులు సాక్షాత్కరించుట * —

క॥ అందుఁదపంబునఁ గాంతుల, సుందర తేజమున నలరు ♦ సుదతీమణితోఁ
జందురుని రేకతో దివి, యందు నినుండట్టులుండు ♦ నభపుంగవు రహిన్. 39

గీ॥ అంతఁగంసాంతకుఁడు రోమ♦హర్షమొనగ, నక్కజమ్ముగఁగనుఁడమ్ము♦లలరఁగనియు
జమిలిపాముల జన్నిదం ♦ బమరువాని, నఖిలపైనతసంఘూర్తి ♦ హాయని పొరుని. 40

సీ॥ గద త్రిశూలం బజ♦గవము వజ్రంబు హ, స్తములందు నెంతేని ♦ దళుకు లీన
నెలబాలుఁ డొప్పొందు ♦ లలితకిరీటంబు, నిగనిగలందంబు ♦ నీటుసూప
మొలపయిన్ గట్టిన ♦ పులిచర్మ మెంతయుఁ, గర్బురదీధితుల్ ♦ గ్రమ్ముకొనఁగ
నురమున నొప్పొందు♦చున్న పసిండి త, మ్మిలపండ చీలమం♦డలకుఁ దాఁక

గీ॥ సంజప్రొద్దున శారద ♦ సమయమందు, మేల్మిపరివేషమందున ♦ మెఱయుచంద్రుఁ
డట్లు విలసిల్లు నఖిలాబ్జ ♦ జాండవిభుని, శంకరునిఁ గనుఁగొనియెను ♦ జక్రధరుఁడు.

క॥ ప్రమథగణంబులతోఁ గడు, నొమరొప్పఁగఁ జుట్టఁబడిన ♦ గోధ్వజుఁడొప్పెన్
రమణీయగిరిత్పగపే, మమున నలుపు ప్రొద్దునలె న♦శక్యుఁడయి కనన్. 42

వ. మఱియు నప్పరమశివుని

క॥ ఏకాదశశతరుద్రులు, శ్రీకరు లుడురాజశకల ♦ శేఖరులు ఘన
శ్లోకులు పరమంత్రంబుల, శ్రీకంఠు నుతించుచుండి ♦ రి కరము పేర్మిన్. 43

క॥ ఆదిత్యులు వసువులు వి, శ్వేదేవులు నాశ్వినులును ♦ సిద్ధులు సాధ్యుల్
మోదంబలరఁగ శర్వు న, హాదేవు నుతించుచుండి ♦ రందుఁ గడువడిన్. 44

గీ॥ శతమఖుండును విష్ణుండు ♦ శతధృతియు ని, తరులు గీర్వాణులును రథం♦తరముసామ
మును మహేశ్వరసాన్నిధ్య♦మునఁ బఠించు, చుండి రెంతయు నుల్లాస♦మొప్పమీఱ.

వ. మఱియు నంతను యోగీశ్వరులు బ్రహ్మర్షులు దేవర్షులు భూమ్యాకాశములు ఋక్షములు గ్రహములు నెలలు పక్షములు ఋతువులు నహోరాత్రులు సంవత్సరములు క్షణములు ముహూర్తములు యుగములు విద్య లితిహాసములు సనత్కుమారుఁడు మరీచి యంగిరుఁడు నత్రి యగస్త్యుఁడు పులస్త్యుండు పులహుఁడు క్రతువును మనువులు దక్షుఁడు భృగుఁడు వశిష్ఠుఁడు వేదములు జన్నంబులు దక్షిణలు త్రేతాగ్నులు హవిస్సును మూర్తిమంతంబులగు యజ్ఞద్రవ్యంబు లనంతాది నాగరాజులును గంగాది పుణ్యనదులును సాగరంబులును దేవతలును దేవపత్నులును దేవకన్యలును దశదిక్కులును మునిసహస్రంబులు పరమేశ్వరుని నమస్కరించుచుఁ గొలుచుచుండిరిఁకను గీతవాదిత్రకోవిదులగుగంధర్వులు నచ్చరలు నాటపాట లొనర్చుచుండిరిఁకను విద్యాధరులు జక్కులు దయ్యములు మున్నగునవి కొండలు మాత్రికులు మనోవాక్కరణంబుల మహాదేవు నుపాసించుచుండె నిట్లు కట్టెదుటఁ బరమేశానుండు పొడసూపి వాసుదేవునిఁ జగంబును గాంచుచున్నంత హరి యమ్మహాదేవునిఁ గన్గొనఁజాలకుండుటయు నమ్మహేశ్వరుం డెఱిఁగి యతని కిట్లనియె. 46

క॥ పలుమఱు నీచేతను బూ, జలఁ గొనుచుంటిని హరీ! ప్ర♦శస్తచరిత! యి
మ్మిల నినుబోలెడు నిష్టుఁడు, గలుగఁడు నాకీ జగతి నొ♦కండేనియునున్. 47

## —* శ్రీకృష్ణుఁడు శివుని స్తుతించుట *—

గీ॥ అనిన విని యాతఁ డిట్లనె♦నమ్మహాత్మ, నకు నమస్కార మిద్ది యు♦నారతంపుఁ
బుణ్యకారణునకు బ్రహ్మ♦మును లనుదురు, నిన్ను బ్రహ్మాధిపతినిగా ♦ నిగమ వేద్య!

వ. మఱియును.

క॥ నారాయణునిగ నరునిగ, ధీరులు సెప్పుదురు నిన్ను ♦ దెలిసితిని విభూ!
సారసభవుఁడవు నీవే, శ్రీరుద్రుఁడవీవె ♦ తక్క జేజేలీవే! 49

ఉ॥ నీవలనన్ జగంబులిటు ♦ నెక్కొనె స్థావరజంగమంబులై
యీవిధమొప్పు ప్రాణములు ♦ నింద్రియముల్ మనముల్ బ్రతీకము
ల్పావకుఁడున్ హవిస్సును స ♦ వంబులు సోముఁడు వేదమంత్రముల్
నీవె మహేశ! దత్తమును ♦ నీవె యధీతము నీవె యారయన్. 50

క॥ నీవే యెల్లరహృదయము, లో నాసముసేయునా య ♦ లోకపురుషుఁడౌ
దీవే యణిమవు లఘిమవు, నీవే జ్యోతివి మహాత్మ! ♦ నీకివె ప్రోతల్. 51

## —♦ దండకము ♦—

శ్రీమన్మహాదేవ! దేవాదిదేవా! సుదివ్యత్ర్పభావా! భవాపత్సముద్రాంతరోద్వి
గ్నజీవోద్ధరప్రౌఢభావా! భవా! సర్వగీర్వాణకుర్వాణకోటీరకోటిస్ఫురత్కోటిజ్వాల
దరత్నరింఛోళిచంచద్ఘృణీజాలనీరాజితాంచత్పదోత్ఫుల్లనాళీక! నాళీకజన్మాది
తాళీకవాగ్రీమతన్మస్తవిచ్ఛేదనాటీకసవ్యాగ్రహస్తాగ్రభాస్వన్నఖాగ్రా! ప్రశ
స్తేందురేఖాసముత్పింగరంగజ్జటాబంధబందీకృతాకాశగంగా సముత్తుంగభంగాభిషి
క్తోత్తమాంగాభిరామా! యుమాదేవి దివ్యాంగరాగోరుసౌగంధ్యనిత్యప్రవర్షస్థలా!
లాలితక్రౌంచభిత్కుంజరేంద్రాననా! పాలితశ్రీశిలాదాత్మజాహ్లాదొస్తమాఖిల
వేత్రాంశుమాలా పరిక్షిప్తసాన్నిధ్యసంశోభితా! శర్వ! సర్వావనావ్యాపనామోదా,
వచోభూతవేదా! భవద్దివ్యమాహాత్మ్య మూహింపశక్యుండనే! తావకీనాసుసద్వ్యోరు
దేహంబు రూపంబుఁ దేజంబుఁ గారుణ్యభావంబిటుల్ చూపినావన్య మెవ్వండుఁ గాంచకే
ధన్యునిన్ జేయవే నిన్ను గన్నారఁగంటిన్ జగంబెన్నఁగొంటిన్ గడున్ హర్షముల్
దర్శముల్ వేగఁ బాలింపుమా పల్కు లాలింపుమా సర్వలోకేశ్వరా! శంకరా!
శ్రీకరా! తేనమస్తేనమస్తేనమః.

గీ॥ ఇట్లు కృష్ణుఁడుపలికిన ♦ నెల్ల జగము, లుల్లసిలియుల్లె యనునట్లు ♦ లోకులాటు
సింహనాదంబులొనరించి♦ చెలఁగెఁగృష్ణు, శిరమునన్ బుష్పవర్షంబు♦గురిసెమిగుల.

గీ॥ అపుడు భగవానుఁడగు శివుం♦డతిరయమున, దేవియగునుమనున్ శత♦ధృతినిఁజూచి
నలిననేత్రునకనె హరి! ♦ నాదుభక్తి, కరమొనర్చెద వీవు నేఁ ♦ గాంచుచుందు.

## —* శ్రీకృష్ణునకుఁ బార్వతీశివులు వరంబుల నిచ్చుట *—

క॥ ఎనిమిదివరముల నడుగుము, వనజేక్షణ! నీయభీష్ట ♦ వాంఛితముల లే
దన కే నొసంగెదను నా, మన మిది ప్రేమించు నిన్ను ♦ మానక యెపుడున్.

క॥ పరమశివుఁ డిట్లు డగ్గఱి, కరుణఁబలికి నట్టినుడుల ♦ కర్జమెఱిఁగి తా
మరసాక్షుం డౌ కృష్ణుఁడు, శిరమున మ్రొక్కులిడి పల్కెఁ ♦ జెన్నుగనిట్టుల్.

చ॥ సుకృతమునందు దార్ఢ్యము య ♦ శోధనమున్ ఘనమౌబలంబు శ
త్రుకులవిఘాతమున్ శతసు♦తుల్ వరవిక్రమవిస్ఫురత్త్విషల్
సకలజనప్రియత్వమును ♦ సాంతతరోత్తమయోగశక్తి తా
వకమగు సన్నికర్షము శి ♦ వా! యొసగంగఁ దలంతు నర్మిలిన్.

*గీ॥ అనిన నట్లగుఁగాక నె ♦ నమ్మహేశుఁ, డమ్మహేశ్వరి జగదంబ ♦ యనియె నిట్లు
ప్రభుఁ డొసంగెను నీకు వ♦రములఁగృష్ణ!, యష్టవరములనేనిత్తు ♦ నల్లకొనుము.

వ. అనుటయు నతం డంబికకు శిరంబున మ్రొక్కి యిట్లు వరంబుల నడిగె. 58

గీ॥ బాపలం దల్క లేమియుఁ ♦ బరమభోగ
మును సుతశతంబుఁ గులమందు ♦ ముదముఁ దల్లి
దండ్రియొక్కయు సుప్రసా ♦ దములు శమము
దాక్ష్యము నొసంగు మమ్మ! నెం ♦ తయును జనని! 59

క॥ అనినఁ దథాస్తని త్రిభువన, జనని మఱియు ననియె నమర ♦ సన్నిభ! యెపుడే
నిని నే వలుకక్కఁ బల్కను, గనెదవు భార్యాసహస్ర ♦ కౌశల్యంబున్. 60

గీ॥ మఱియు దారలవాల్లభ్య ♦ మరుదమిూఱు, బాంధవప్రేమ మఱియ♦బలముతనరు
నేడువేలు ద్విజులు నీదు ♦ నిమ్మనందుఁ, గుడుతు రిష్టంబు తీరు నే♦కూరు తనువు.

క॥ వరముల నిట్లొసఁగి తగన్, వరదులు శివు లంత దివిజ ♦ వర్గముతోడన్
నరగున నంతర్హితులై, ఠరుసమ్మును జెంది కృష్ణుఁ ♦ డంత రయమునన్. 62

వ. గురుండగు నుపమన్యునిఁజేరి మహేశ్వరానుగ్రహం బెఱింగించినంత మురిసి
యమ్మహామహుండు పద్మలోచనున కిట్లనియె. 63

---

* శివపురాణే ఉమాసంహితాయాం తృతీయాధ్యాయే - శ్రీకృష్ణ వచనం —

శ్లో॥ ఋష్యస్థో నుపరాన్ దేహి । దేవదేవ నమోస్తుతే। సర్వేశ్వరస్త్వమేవాసి। మత్ప్రభుశ్చ విశేషతః॥
సనత్కుమార ఉవాచ - తస్యతద్వచనం శ్రుత్వా । తమాహ భగవాన్ భవః । సర్వం భవిష్య
తిత్యేవం । పునస్స ప్రాహ శూలభృత్ ॥ సాంబో నామ మహావీర్యః । పుత్రస్తే భవితాబలీ
......శ్రీకృష్ణ ఉవాచ - శ్లో॥ ఇత్యాద్యాస్సువరాస్సంతు । ప్రసాదాత్తవ పార్వతి॥ సన
త్కుమార ఉవాచ - తస్య తద్వచనం శ్రుత్వా । దేవీతంచాహ విస్మితా । ఏవ మస్త్వితిభ
ద్రం తే । శాశ్వతీ సర్వకామదా ॥

॥క లేఁడు శివుఁబోలు వేల్పు, లేఁడు శివున్ బోలు దాత ♦ లీలాకారా!
లేఁడు శివుఁబోలు సులభుఁడు, లేఁడు శివున్ బోలు బిరుదు ♦ లెక్కింపంగన్.

వ. అని సంతసించినంతఁ గృష్ణుం డాయనఘుని సెలవొంది స్వపురంబుఁ జేరి జాంబవతియందు సాంబుండన్ గుమారునిఁ బడసి సుఖంబుండె నిట్లు శ్రీకృష్ణ పుత్రలాభోదంతం బెఱింగించితి నీ కేను వినుదురన సూతునకు మునులు మహాత్మా! మున్నెవ్వరెవ్వరు శివమాయామోహితులై జ్ఞానంబుఁ బాసి చరించిరో యట్టి వారి నెఱుంగఁజెప్పి యవ్వలఁ బాపభేదంబులను బాపభోగ్యంబులగు నరకభేదంబుల నెఱింగింపుమనిన సూతుం డలరి యిట్లనియె.

## —* శివమాయా మోహితులు *—

క॥ కమలాక్షుండా విష్ణుఁడు, భ్రమాత్మకంబైన శివుని ♦ బలువగుమాయన్
దెమలఁగలేక యనేక, ప్రమదలసాంగత్య మొందెఁ ♦ బలుతెఱఁగులన్. 66

క॥ నలువయు శివమాయఁగడున్, నలిగి యలవిగానియట్లు ♦ సృష్టినిరహించేఁ
గలయఁగఁ బూనెను గూఁతున్, బలుమఱు లాఁతులనుఁజూచి ♦ బాళినలదురెన్.

క॥ మీఁదున్ గ్రిందును గనకయె, కాదన కనుచితపుసరణిఁ ♦ గానలుగొసదున్
గాదిలిచెల్లెలిని వశి, ష్ఠాదులు గనయంగఁగడఁగి ♦ రభవునిమాయన్. 68

వ. మఱియు నజేయంబగు నాశివమాయన్ జేసి.

సీ॥ ఇంద్రుఁడు గౌతమ♦ఋషిపత్ని నాయహ, ల్యను మోసఁజేసి క్రీ♦డనుబొసఱ్చె
అగ్ని కృత్తికలను ♦ నార్యురవలచి బ, ల్మిగులొంది ప్రాణంబుఁ ♦ బోసఁగఁదొడరె
నమ్మహాబలుఁడును♦నంజనిన్ గామించి, క్రీడించి పుట్టించెఁ♦గీశవర్యు
మిత్రావరుణులు ల్ల♦మెలఁతనూర్వశిఁజూచి, గళితతేజస్కులై♦కనిరి సుతులఁ

గీ॥ జందురుఁడు గురువనితతో♦సౌరతోడు, భోగములనొంది తనయుని♦బుధునిఁగనియె
శాండిలియనాఁగ నొక కన్నె♦సర్పవైరి, వలచి తెక్కలుగాల్పఁగఁ♦బడియె వినుఁడు.

సీ॥ వాచస్పతి యటంచు ♦ వైభవంబున మించు, జీవుఁడగ్రజపత్నిఁ ♦ జెందెఁదమిని
బ్రహ్మనిభుండు ప♦రాశరుం డల దాశ,కన్యక తోఁ గూడి ♦ కనియె వ్యాసు
ఘనుఁడౌ విభాండక♦ముని లేడిఁగని ముక్త, తేజుఁడై కనియె ను♦తిస్ గుమారు
నచ్చరయగు మేన♦యనుపొలంతికిలోఁగి, గాధిపుత్రుఁడు గంగఁ♦గలిపెఁదపసు

గీ॥ ఇఁక భరద్వాజుఁడ నెడువా♦నీందుఁడలఘుఁ, డాహరిద్వారమున గంగ♦యందుఁ గ్రీడ
లాడెడుఘృతాచియనుదాని♦నభిలషించి, స్కన్నవీర్యుఁడై కనియెనొ♦క్కనిఁదనూజు,

వ. వారువీరననేల? లోకంబందెల్ల వారలు శివమాయామోహితులై కామబాణంబులకు గుఱిగానివారులే రిది సిద్ధం బిఁకను బాపంబుల తెఱం గెఱింగించెద వినుండు.

## —* పాపభేదములు *—

క॥ మనసున నాలుగునున్ వాక్కున నాలుగు మూర్తి నాలు♦గును నగు పాపా
లను బొనరించినవారలు, చనుదురు నిరయంబుఁ జేర ♦ సన్మునివర్యుల్! 72

వ. అవి యెవ్వియందురేని వినుండు.

క॥ పరసతినిఁ గవయఁగోరుట, పరధనముల కాసపడుట ♦ భావముచేతన్
బరుల కపకృతినిఁ గోరుట, యిరవుగఁ జెడుపనులఁదలఁచు♦టెపుడుఁదగ వెదక్.

గీ॥ అప్రియముఁ బల్కుటయుఁ గల్ల♦లాడుటయును
గొండెములు సెప్పుటయు నుంతఁ ♦ గొంకులేక
తిట్టుటయు నను నివి నాల్గు ♦ చెట్ట లెపుడు
వాకునెడ దోసములు వీనిఁ ♦ బాయవలయు. 74

క॥ తినఁదగనివి దినుటయుఁ బర,ధనముల దొంగిలుట పరుల ♦ దారలతోఁ గ్రీ
డనుబొనరించుట హింసయు, ననుచితములు దేహమునకు♦నారయవలయున్. 76

వ. తినఁ దగని పదార్థంబుల నిర్ణయింతుఁడు.

గీ॥ వినుఁడి శామాంసములును ల♦శునప లాండు శిగ్రువిడ్వారాహంబులు♦ శేలువును న
భక్ష్యములు గాఁగఁ జెప్పఁగ♦బడుట వాని, వర్జనమొనర్పవలె ధర్మ♦పరుఁడుపుడమి.

వ. ఇఁకను నరుసగ దోసంబులను వక్కాణించెద వినుఁడు.

క॥ శివునిన్ గురుఁ దలిదండ్రుల, శివభక్తుని మఱియు శైవ♦శిష్టాచార్యున్
శివశాస్త్రంబుల నెపుడే, నవమతి నిందింపఁగూడ♦దఘమగును గదున్. 78

సీ॥ శివలింగమును జూచి♦చేమోడ్పనట్టిఁడు, శివుగుడిన్ బొలఁతుకఁ ♦ జెందునతఁడు
శివఘనంబులను ముద్రి♦ చ్చిలికొనునాతండు, శివరాత్రిఁబవలుబో ♦ సేయునతఁడు
శివునిఁబుస్తకానా♦జసి ఖచ్చునట్టిఁడు, శివప్రూజవరాని భు♦జించునతఁడు
శివునగి పెజపేల్పుఁ♦జింతసేయునతండు, శివునివ్రతంబులఁ ♦ జెఱచునతఁడు

గీ॥ గురునిఁ గొలువక పంతంబుఁ♦గోరునతఁడు, గురునిపరిచర్య సల్పని ♦ కుత్సితుండు
ఆపదన్ గుందుగురుఁబాసి♦నట్టియతఁడు, చేరుదురు నిరయంబును♦సిద్ధమిద్ది. 78

సీ॥ అసువిద్యపేదాధ్య♦యనమొనర్చునతండు, తల్లిదండ్రుల నెప్పు♦డొల్లనతఁడు
పంచయజ్ఞంబులఁ ♦ బాసిమెక్కు నతండు, తను గొప్పగా నెన్ను♦కొనునతండు
చదివిన వేదంబు♦వదలి మఱచినట్టిఁ, డాలను బోయల ♦ కమ్మునతఁడు
దేవభూదేవ వృ♦త్తినిఁ జూఱగొన్నట్టిఁ, డాలమందలు మేయు♦నట్టి పొలము

గీ॥ నాక్రమించిన యట్టిఁడు♦నాల తెరువు,నందు నగ్గినివేసెడు ♦ నట్టియతఁడు
దీనులగువారిసొత్తు నెం♦తేనిఁగొనిన, యట్టిఁడును నిరయంబుల♦నందఁగలరు. 79

క॥ చెఱువులుఁదోఁటలు గుంటలొ, నరిచిన వ్రతములను దనదు♦నాతిని సుతలన్
మఱి సుతులను వెలకమ్మెడు, నరుఁడొందఁగలండు ఘోర♦నారక బాధల్. 80

ఆ॥ వినుఁ డనాథయైన♦వెలఁదిని బాలను, వృద్ధురాలి మిగుల ♦ వెఱమడాని
సతినిఁ దపసుఁజేయు♦చానను వంచన, చేయువారు నరక♦సీమ నుంద్రు 81

క॥ వేదక్రేతలు మఱియు, వ్వేదమునున్ దెగడువారు ♦ వేదవిరోధుల్
వేదముఁ జూచి పఠించెడు, చేదస్తులు నిరయగతికిఁ ♦ జేరుదు రవలన్. 82

—* పంచమహాపాపులు *—

క॥ బాపనిఁ జంపినవాఁడు సు, రాపియు గురుతల్పగుఁడు హి♦రణ్యాస్తేయుం
డీ పాపులఁ గూడిన పెను, పాపుఁడునుం బంచఘోర♦పాపులు పుడమిన్. 83

సీ॥ గోవిప్రకన్యకా♦గురుకార్యములకు వి, ఘ్నంబు చేసెడునట్టి ♦ కశ్మలుండు
గురుల దోసములేని ♦ కోమలినిన్ బరి, జనులఁ బాసినయట్టి♦ పాపశాలి
చలిపందిరులమేలి ♦ సత్రంబులను సభా, భవనంబులన్ గూల్చు ♦ పంకమూర్తి
బాలవృద్ధులకును ♦ బరిజనులకుఁ బెట్ట, కన్నంబు ముందు ది ♦ న్నట్టి ఖలుఁడు
గీ॥ విల్లు నమ్ముల కత్తుల♦విసము నమ్ము, వాఁడు పశువులకున్ ముకు♦దాడు వేయు
వాఁడు శిలలను మేకుల♦బాటకడ్డి, నేయువాఁడును నిరయంబుఁ ♦ జెందఁగలరు.

ఉ॥ కల్లలనాడువాఁడు గురు ♦ కాంతను నోడక ధిక్కరించువాఁ
డుల్లమునందు నక్కటిక ♦ మూననివాఁ డభిచారకృత్యముల్
పెల్లుగ సల్పువాఁడు ద్విజుఁ♦బిల్చియు సుంతయు నీకపంపువాఁ
డొల్లమి సాధులౌ ద్విజుల ♦ నూరక దూఱెడువారు పాతకుల్. 85

క॥ పరివేత్తయుఁ బరివిత్తియుఁ, దెఱవలనున్ దార్చునతఁడు ♦ దంపుస విసమున్
బరులఁ దినిపించువాఁడును, నిరతముఁ గామాతురుఁడయి ♦ నెగడెడువాఁడున్.

క॥ కన్నెను జెఱచెడువాఁడును, గన్నియధన మపహరించు ♦ కఱటి రజముతో
నున్నసతిఁ గూడువాఁడును, బన్నుగఁ బర్వముల రతినిఁ ♦ బడసెడువాఁడున్.

గీ॥ వరుసగానట్టి యువిదతో♦సురతమొందు, నరుఁడునుంగూటసాక్షియుఁ♦ బరులసొమ్ము
దాఁచనిడ నపహృతిచేయు ♦ దారుణుండుఁ, బశువులనుబట్టి క్రోడించు ♦ పాపశాలి.

క॥ ఒకబంతియందునున్ వం, టకమున భేదంబుఁజేయు ♦ టాటోటును దా
నొకవిస్తరివేసుక తలఁ, కక కుడిచెడువాఁడు నరక ♦ గతులొందుఁ రోగిన్. 89

గీ॥ ఎపుడు దుర్దానములఁగొంచు♦సేవపడక, కల్మషాత్ములకడఁ బ్రీతి♦గ్రహముసేయు
నట్టి బాపఁడు నరిగొంచు ♦ నవనిఁగావ, లేని భూమీశ్వరుఁడును మ♦లీమసు లిల.

క॥ కలిమి కడుఁగలిగి పేదలఁ, దలఁపక తగినట్టి యీవిఁ ♦ దక్కినవారల్
బలమైన రుజను గడుశోఁ, పిలు పేదకు మందు లిడని ♦ చెన్నటినైద్యుల్. 91

క॥ కూలుదురు నరకమునఁ గడుఁ, బేలుదురు భ్రష్టశాస్త్రులగుచు ♦ బిట్టుగ నగ్నిన్
గాలుదురు తెరువుఁగాంచక, సోలుదురు నితాంత భూరి ♦ శోకాతురులై. 92

—* బ్రహ్మఘ్నసమానులు *—

సీ॥ దప్పిఁజెంది జలంబుఁ♦ద్రావఁగావచ్చు గోఁ, జాతికి విఘ్నంబుఁ ♦ సల్పువాఁడు
వేదశాస్త్రముల ♦ వివేక మించుకలేక, కొంచక సభల దూ♦షించువాఁడు
కడు నందమున నొప్పు ♦ కన్నకూఁతును దగి, నట్టి భర్తకొసఁగ ♦ నట్టివాఁడు
కుడుసంగరమ్మని ♦ గుణశాలియగుబ్రాహ్మ, ణునిఁబిల్చిమరలఁ బో♦మ్మనెడువాఁడు

గీ॥ మఱియు గోష్ఠవతంబుల♦మాన్యములను, బాడబునివృత్తిహరియించు♦ వాఁడునంధ
పంగులజడదరిద్రులముల♦బడయుఁవాఁడు, బ్రహ్మఘాతులుగాఁజెప్ప♦బడుదురిలను.

గీ॥ చెలిమిఁజేయుచునహితంబు♦చేయునతఁడు, పిలిచియువిషాన్నమునుదిని♦పించునతడు
కనుచుహింసనుమాన్పని ♦ ఘాతుకుండు, నరకమునఁ బొక్కుచుందు ర♦నారతంబు.

గీ॥ వీరలందఱు నొకవైపు ♦ వినుఁడుమీరు, మేలు చేసిన వారికి ♦ మీఁటి కీడు
చేయువాఁడును నట్టులఁ ♦ జేయఁదలఁపు, చేయువాఁడును నొకవైపుఁ ♦ జేరగలరు.

క॥ పరులకలిమికిని సంతుకుఁ, బరుల మహోన్నత్వమునకుఁ ♦ బాయక మదిలోఁ
మఱుఁగుచునుండెడిచెనఁటులు, చిరకాలము నరకబాధఁ ♦ జెందుదురు మునుల్!

సీ॥ భూదానమొనరించి ♦ భూమినీయక తామె, యనుభవించుచునున్న ♦ యట్టివారు
గోదానమొనరించి♦గోద్రవ్యమును దామె, యారగింపుచునున్న ♦ యట్టివారు
కన్యకాదాన మ♦క్కఱఁజేసి కూఁతును, నల్లున కంపని ♦ యట్టివారు
సత్రంబు లమరించి ♦ చాలఁగ సవ్వాని, యద్దెల కిచ్చుకొ ♦ న్నట్టివారు

గీ॥ జన్మములొనగ్నమనుమ వి♦స్తారధనము, నార్జన మొనర్చి యటుసల్ప♦నట్టివారు
విత్తముల నప్పుఁగొని యెగ♦వేయువారు, చేరుదురు నరకార్తిని ♦ సిద్ధముగను.

గీ॥ ఆలుమగలును దలి ♦ దండ్రు లాత్మజాతు, లన్నదమ్ములు మిత్రులు ♦ నల్లెగురువు
శిష్యుఁడును వీరలకుఁగల ♦ చెలిమిఁబాపి, కొంకకవిరోధమును♦ నొడగూర్చువారు

క॥ కలుదోసంబులు తనయెడఁ, గలిగియు వేఱొకరియందుఁ ♦ గలుగకయున్నన్
జలమునఁ బరులను దెగడెడు, పలుగాకులు దెఱపిగొనని ♦ పాపులు పుడమిన్.

గీ॥ పసులమేఁతల పంటకు♦ప్పలను బరులఁ,యిండ్లఁగాల్చెడువారు డ♦బ్బీయకప్పు
పత్రముల సృష్టిచేసెడు♦వాడు పరులఁ, జంపువా రొందుదురు నర♦కంపువసతి.

ఆ॥ అడవి నిరపరాధు♦లై యుండుప్రాణుల, హత్యసేయువాఁడు ♦ నాలఁగట్టి
పొలముదున్న వాఁడు♦పొంకమొప్పఁగ నెద్దు, నెక్కువాఁడునిరయ♦మేగఁగలరు.

క॥ అతికోపను లతిలోలుపు, లతికాముకు లతిపిశునులు ♦ నతిగర్వులు నెం
దతివచనులు నతిభక్షులుఁ, గుతుకంబఱ యమునిశిక్ష♦కుఁ బాత్రంబుల్. 102

## —* న ర క ము లు *—

వ. ఇఁకను వారల కందఱ కవశ్యానుభోగ్యంబులగు నారకభేదంబుల నెఱింగించెద వినుండు. నిరయంబు లష్టావింశతిపరిమితంబులుగ విద్వాంసులు లెక్కవెట్టిరి. రౌరవంబు, మహారౌరవంబు, తామిస్రం, బంధతామిస్రంబు, కుంభీపాకంబు, కాలసూత్రం, బసిపత్రవనంబు, సూకరముఖం, బంధకూపంబు, కృమికూపంబు, కృమిభోజనంబు, తప్తవాలుకంబు, వజ్రకంటకంబు, శాల్మలియు వైతరణియుఁ, బూయోదంబును, విశసనంబును, లాలాభక్షణంబును, సారమేయాదనంబును, నవీచియు, నథశ్శిరంబును, క్షారకర్దమంబును, రక్షోగణంబును, శూలప్రోతంబును, దందశూకంబును, వటారోధంబును, మహాజ్వాలంబును, సూచీముఖంబును ననునవియు మఱియు నీయవి యొక్కొక్కఁ డైదువిధంబులతో నొప్పి నూటనలువది విధంబులై పరఁగు నిందు యామ్యకింకరులు పాపులఁబట్టి పలువిధంబుల బాధించి వేధించుచుందు రిట్టిపాపుల ఘోరదుఃఖంబులఁ బాపఁజాలు దానధర్మంబుల నెఱింగింతు వినుండు. 103

## —* పాపహరంబులగు దానధర్మములు *—

*గీ॥ ధేనుభూ తిలహేమాజ్య ♦ దివ్యవస్త్ర, ధాన్య గుడ రౌప్యలవణము♦లుదితములన
బ్రాహ్మణులకీవలయు నివి ♦ పదియు మేటి, దానములు సర్వదోషని♦వారకములు.

గీ॥ మేక గేదెయు గోఱియయు♦మేలిదాసి, యీను మస్నట్టె యావును♦సిలయుఁ గన్య
పసిఁడియేనుఁగుగుఱ్ఱంబు♦బండినాగ, లియు ననజ్వాహమును గను♦నయముమీఱ.

క॥ పల్లకియును సెజ్జయునున్, బల్లగు ధాన్యములు లిల్లు ♦ బృందముగలయా
నిల్లు పదియూఱు వీనిని, నుల్లసిలుచు నగ్రజనుల ♦ కొసఁగఁగవలయున్. 106

క॥ లలితోపానహపాదుక, లలరెడు ఛత్రంబునున్ ధ ♦ రామరుల కిడన్
విలసిలు యానంబులు ల, క్ష్ముల కిరవగు నిరవు గలుగు ♦ శుభచారిత్రుల్!

వ. మఱియును.

---

* శ్లో॥ గోభూతిల హిరణ్యాజ్య । వాసోధాన్య గుడానిచ । రౌప్యం లవణమిత్యాహుః । దశదానాని కోవిదాః.

క॥ పీటలు రతనాల్ రజతము, నేటగు పరిజనుఁడును నవ ♦ నీతము ఫలము
ల్గాటప్ర దధి తాంబూలము, లాటంకముఁ దక్కి యొసఁగ ♦ నగు బాపలకున్.

వ. పెండ్లియు నీకుఁ దులాపురుషదానం బనన్యసాధారణం బని యివి యననేల?
యిష్టవస్తువు లన్నియుఁ దానార్హంబు లవ్వాని యోజించి సమయానుసారంబరు
లకు నొసంగవలయును 109

ఉ॥ అన్నముచేతఁ బ్రాణిచయ ♦ మంతయు నాయువుఁ జెందియుండు నా
యన్నము లేనియప్డు విల ♦ యంబును జెందును గాన లోకమం
దన్నమె ప్రాణతంబయి సు♦ఖావహమై కరమొప్పియుండు నా
యన్నము నిచ్చువారి బర ♦ మాత్మము మెచ్చు వదాన్యవర్యులన్. 110

వ. కావున

గీ॥ దానములలోన నుత్తమ ♦ దానమన్న, దానమిద్దానఁ గులము గో♦త్రంబుఁ గనక
యెల్లవారల కోదనం ♦ బీవలయును, సర్వసౌఖ్యంబు లిదియిచ్చు ♦ స్వర్గమిచ్చు.

చ॥ ఉదకము సర్వజంతువుల ♦ కొప్పఁగ బ్రాపఁగఁ జెల్లుఁ దొట్లయం
దుదకము పోసియుంచ నది ♦ యొందెడు నాలు వృషంబు లింక నిం
పొదవ ననేక జంతుతతి ♦ యొందు జలంబును నట్టితోట మీ
రిది మదియందెఱింగి సతి ♦ మిచ్చ నొనర్పుఁడు నీరదానముల్. 112

వ. ఇంకను.

క॥ తలిదండ్రులఁ గొలుచుట యొ, జ్జలఁ గొలుచుట నతిథి రిక్త ♦ జనులకు నన్నం
బులనిచ్చుట పడబాపలఁ, గొలఁకులఁ జెరువులను ద్రవ్వి ♦ కూర్చు సుకృతమౌ.

క॥ చలిపందిరులను నీకఁ బూ, వులతోఁటలు ఫలకుజములు ♦ పొల్చెడు తోపు
ల్విలసిలెడు సస్యసత్రము, లలరుచుఁ గూర్పంగ నాక ♦ మాతని కబ్బున్.

క॥ ఇఁకఁ బాఠశాలలును వా, చకమందిరములును బాట ♦ సత్తరువులునున్
రకమగు భజనగృహంబు లు, త్సుకుఁడై కూర్చిన నభీష్ట ♦ సుఖముల నొందున్.

గీ॥ శర్వ గౌరీషడాస్య గ♦జముఖ వీర, భద్రకాళీ కాల ♦ భైరవాయ
తనములును సందిగా విష్ణు♦ధామములును, దదవతారాయతనములు♦దార్చుముదము

క॥ బాలురకుఁ జదువుఁ జెప్పుట, యోలిగ నన్నంబు బట్ట ♦ లొసగుటయు గడున్
నీలుగఁ బాత్రము లిచ్చుట, చాలఁగ సుకృతంబొసఁగు ♦ శర్మము లిచ్చున్.

గీ॥ మట్టి మామిడిమున్నగు♦మార్గకులను బ, థమ్మునందు వరునగ సం♦ధానమొనరఁ
జేయువాఁడును దపసును♦జేయువాఁడు, బొంకనట్టిఁడు శ్రీయంబుఁ♦బొందఁగలరు.

వ. ఈ చెప్పినవన్నియుఁ బాపహరంబులై యొప్పు నందు గోభూదానంబు లుత్తమో
త్తమంబులు; అందును గోదానమందు. 119

గీ॥ వెండిగిట్టలతోడఁ బ♦సిండికొమ్ము, దోయితోఁ గంచుపాత్రితో ♦ దూడతోడఁ
బటముతో గ్రాసములతోడఁ ♦ బాడిమొదవుఁ, దగినవిప్రునకీవలె ♦ ధనముతోడ.

క॥ అటులిచ్చిన నాధేనువు, కుటిలమతిన్ జేసినట్టి ♦ ఘోరతరాంహః
పటలములనెల్లఁ గూలిచి, పటుసౌఖ్యములిచ్చు స్వర్గ ♦ పదములనిచ్చున్. 121

గీ॥ ఎన్నిరోమంబు లావుయం♦దెసఁగియుండు, నన్నివత్సరములు నా♦క♦మందు బాత
చేరియుండును దరియింతురి ♦ సిద్ధముగను, సప్తపురుషులనఱకు వం♦శంబునందు.

వ. ఇఁక సర్వధర్మానుష్ఠానయోగ్యంబగు భూమండలంబు తెఱం గెఱుంగవలయు
నగుట నుపన్యసించెద నాలకింపుడు భూవలయంబునందు, జంబూ, ప్లక్ష, శాల్మలీ,
కుశ, క్రౌంచ, శాక, పుష్కరనామకంబులగు సప్తద్వీపంబులు లవణేక్షుసురా
సర్పిర్దధిక్షీరజలార్ణవశోభితంబులై యెసంగు. 123

## —* భూమి సప్తద్వీపములు *—

క॥ భూపద్మమధ్యజంబూ, ద్వీపము యోజనపు లక్ష ♦ వెడలుపు నటులే
యా పొడవును గలిగి కదున్, శ్రీపదమై యొప్పు లవణ ♦ సింధువృతంబై.

గీ॥ లలితముగ దీనిమధ్య ని♦లావృతంబు, వర్షమొప్పెసుఁ దన్మధ్య ♦ వాసిమీఱు
మేరుశైలంబు ధారుణీ ♦ నీరజమునఁ, గర్ణికాకృతిఁ దనరుఁ బొం♦కంబుమీఱ.

వ. ఇక్కనకపర్వతంబు పదియాఱు యోజనంబు లధఃప్రదేశంబునఁ దిగుభూమిగను
భూమినుండి యెనుబదినాలుగు యోజనంబులు పొడవుగను నందు బదియాఱు
యోజనంబులు శిఖరంబులుగను జెలువొందియుండు నిఁక నిద్దానికి దక్కసంబున
నిషధహేమకూట హిమాచలంబులును నుత్తరంబున నీలశ్వేతశృంగి పర్వతంబు
లును భాసిల్లియుండు. ఈయవి పదివేల యోజనంబుల పరిమితితో రత్నసంతతం
బులై యరుణప్రభలు గలిగి యొప్పారు నిఁక నిలావృతవర్షంబుతోఁ గూడఁ
దొమ్మిది యగు భారతాదివర్షంబు లొక్కొక్కటి తొమ్మిదివేల విస్తారంబుతోఁ
గులశైలంబులతో నొప్పుచుండు. భారతవర్షము కింపురుషవర్షము హరివర్షము
కేతుమాలవర్షము భద్రవర్ష మిలావృతవర్షము రమ్యకవర్షము హిరణ్మయ
వర్షము కురువర్ష మనునవి. అందు మేరువునకు దక్షిణంబున భారత కింపురుష
హరివర్షంబులును నుత్తరంబున రమ్యక హిరణ్మయ కురువర్షంబులును మధ్యం
బున నిలావృతవర్షంబును దూర్పున భద్రాశ్వవర్షంబును బడమట కేతుమాల
వర్షంబును బరంగునిఁక నిట్లే యీ మేరువునకుఁ బూర్వాది చతుర్దిశలందు

మందర గంధమాదన విపుల సుపార్శ్వంబులను పర్వతంబులును దచ్ఛిఖరంబు లందుఁ గదంబజంబూపిప్పలవట వృక్షంబు లొప్పియుండును. 127

క॥ జంబూవృక్షములందు గ, జంబులఁ దుల సేయునట్టి ♦ చక్కనిపండ్లో
జం బూఫలవిగాలి యవియుఁగ, జంబూనది యొదవెఁ దద్ర♦సంబున నచటన్. 128

గీ॥ ఆనదీతీరమున నున్న ♦ యఖిల జనులు
తోయముగ నానదీ స్వాదు ♦ తోయమును భృ
శముగ దోయిళులన్ ద్రావి ♦ యమృతరసముఁ
గాఁగఁ బాటించి మోదంబుఁ ♦ గాంతు రిమ్మిగుల.

క॥ అది త్రావినవారలకె, స్వేదవదు దుర్గంధము జర ♦ యును జెమటయునున్
బ్రిమాలస్ప బిగి నింద్రియములు, మదికుత్సాహంబు లగ్గు ♦ మఱిమఱి గూర్చున్.

క॥ ఇందలి మృత్తికతోడన్, గుందన మడియొదవు మగల ♦ కుం గొమ్మలకున్
జెందించుఁగాంతి సగలను, బొందించును హాటసమిడు న♦పూర్వతరముగాన్.

వ. ఇంక మేరువునకుఁ బూర్వనఁ జైత్రరథంబును దక్కినంబున గంధమాదనంబును బడమట విభ్రాజంబును నుత్తరంబున నందనవనంబు నను వనంబులును అరుణోదంబు మహాభద్రంబు శీతోదంబు మానసంబు నను సరస్సులును బూర్వాదిగ నొప్పుచుండు మఱియును శీతాంజనంబును గురంగంబును గురరంబును మాల్యవంతంబునను శైలంబులు మేరువునకు బూర్వకేసరాచలంబులుగను, త్రికూట శిశిరపతంగరుచకనిషధకపిలగిరులు దక్షిణకేసరాచలంబులుగను సినీవాసము కుసుంభము, కపిలము నారదము నాగముమున్నగు నగంబులు పశ్చిమకేసరాచలంబులు గను శంఖచూడ ఋషభహంస కాలంజర పర్వతంబు లుత్తరకేసరాచలంబులు గను నొప్పుచుండు నిక మేరువుమీఁద మధ్యభాగంబందుఁ గనకమయంబగు బ్రహ్మపురంబు పదునాల్గువేల యోజనంబులపరిమితితోఁ జెలువొందు.

గీ॥ ఈవిధి పురంబునకుఁజుట్టు♦నెంతయోని, యష్టదిక్కులయందేచి ♦ యష్టలోక
పాలకులపట్టణంబులు♦విస్త్రీమీఱు, దివ్యజనులందఱుందురు ♦ దీప్తినందు.

వ. మఱియు నిద్దానికి విష్ణుపదవినిష్క్రాంతయగు గంగానది సీతయని, యలకనంద యని చక్షువని, భద్రయని నాల్గుపేరులతోఁ దూర్పునుండి నలుదెసల నానాశైల వనస్థలులఁ బాఱి యంబుధిఁ జేరు. 133

గీ॥ మేరుగిరిఁజుట్టుకొనియున్న ♦ ద్రోణిధ్రి, దరులయందును నందనో ♦ ద్యానవనుల
దివ్యజను లప్సరస్సుద ♦ తీరతముల, సంతతంబు సుఖింతురు ♦ శంకదక్కి. 134

క॥ భారతవర్షంబిఁకను దు, హాగిరికి దక్కినమున ♦ సంద్రమున కుద
గ్ధారుణశైలము తగుఁ బ్రదిన, భూరిసుఖంబులకునిద్ది ♦ మూలమయితగున్. 135

గీ॥ ద్వీపనవకంబులం దిది ♦ తేజరిల్లు, నవసహస్రపరిమితిఁతో ♦ నగవ దుపునఁ
దూర్పునఁగిరాతులుండు రిం♦దుర్క బడమర, దక్షిణంబునయవనులు♦సగ(ఁ)జరింత్రు.

క॥ మఱియుత్తరమునఁబాపసు, లురువుగ బ్రాహ్మణులు క్షత్రి♦యులును విటు[illegible]ము్రిల్
పరఁగుదు రిజ్యాఽఽజితులా, పరిచర్యలఁ గుశలు లగుచుఁ ♦ ప్ర[illegible]షి[illegible]సరిక్.

వ. ఇఁక నిం దుపవర్షంబు లింద్రద్యుమ్న కసేరు తామ్రపర్ణ గభస్తిమన్నాగద్వీప సౌమ్య గంధర్వ వారుణ భారత సంజ్ఞల నొప్పుచుండు. ఇది [illegible] నిందు మహేంద్రము మలయము సహ్యము [illegible]మము ఋక్షపర్వతము వింధ్యము పారియాత్రము నను కులపర్వతంబు లేడును మహేంద్రగిరిజాతం[illegible]లగు త్రియామ ఋషికుల్యా మున్నగు నదీనదంబులును [illegible] ఋషికుల్యా కుమారి మొదలగు నదీ[illegible]లును మలయపర్వత[illegible]సంభవంబులగు కృతమాల తామ్రపర్ణి మున్నగు నదీతిలకంబులును సహ్య[illegible]సంభవంబులగు కృష్ణవేణి మున్నగు మహాధునులును ఋక్షపర్వతవినిర్గతంబులగు గోదావరి భీమరథి మున్నగు మహావాహినులును వింధ్యోద్భవంబులగు [illegible]సురస మున్నగు మహానదులును మంచుఁగొండనుండి ప్రవహించిన గంగయమున సింధు బ్రహ్మపుత్రి మొదలగుతటినీవితంసములును గలవు. [illegible] కలియుగంబులానటిల్లుచుండు. ఈభారతవర్షంబునఁ దపంబును [illegible] పూజనంబులు నొక్కడొనర్తు రిది కర్మభూమియని పేరొందినది [illegible] దెల్ల జంబూద్వీపంబును, సందునను భారతవర్షంబును శ్రేష్ఠంబని [illegible] వచింతు రన్యంబులు భోగభూములు. [illegible] జన్మం[illegible] వర్గాపవర్గమార్గంబగు నీభారతవర్షంబునఁ బుట్టుదురు [illegible] దక్షిణవర్షంబులతో నొప్పు లక్షయోజనవిస్తీర్ణంబగు జంబూద్వీపంబు [illegible] జెంగించితి నిఁక దీనికన్న ద్విగుణంబు ప్లక్షద్వీపం బ[illegible] కందకంబై యుండు నందు గోమంతము చంద్రము నారదము [illegible] సుమనశ్శైలము వైభ్రాజంబను పర్వతంబులుండు నిందు [illegible] వులు వసింతు రిందలి జనంబులు పదివేలేండ్లు జీవింతురిందు, [illegible], పాపఘ్ని, త్రిదివ, కృప, అమృత, సుకృత యనెడు [illegible] చుండు నా నద్యుదకమును సంతోసంబుతో సంపఱుచు [illegible] వస్థలేదు. ఎల్లప్పుడు త్రేతాయుగంబుఁబోలి యుండును. బ్రాహ్మణక్షత్రియ వైశ్య శూద్రులు స్వధర్మపరులై 138

క॥ శంకరుని సర్వవిష్టప, శంకరు నిఁక సారసాక్ష ♦ సారసభవులన్
సంకటహారులను గొలుచుచు, జంకక యుందురు నితాంత ♦ సంతుష్టులునై. 139

వ. ఈద్వీపమధ్యమందు జువ్విమ్రాను మధ్యమందుండుటన్ జేసి యిది ప్లక్షద్వీపంబయ్యె నీప్లక్షద్వీపంబు నావరించి యిక్షురసార్ణవంబు చుట్టియుండు నద్దానిపైన శాల్మలి ద్వీపంబు పూర్వద్వీపంబుకన్న ద్విగుణంబై యొప్పు నిందు శ్వేతము హారీతము జీమూతము రోహితము వైకలము మానసము సుప్రభ మనునవి యేడు వర్షంబులుండును. ఇంక పుణ్యోదకంబులు సుశీతలంబులును నగు శుక్ల, రక్త, హిరణ్యా, చంద్రా, శుభ్రా, విమోచన, నివృత్తి, యను నేడు నదులు ప్రవహించుచుండును. ఇందెల్లరు భగవంతుని శంభుని బూజించుచుందురీ ద్వీపంబందు బూరుగచెట్టు మధ్యమందుండుట నిద్దిశాల్మలి ద్వీపంబని పేరొందె నిద్దాని సురాసముద్రం బావరించి యుండును కుశద్వీపంబు పూర్వద్వీపంబుకన్న ద్విగుణంబు, అందు రక్కసులు దేవగంధర్వ కింపురుషులు బ్రాహ్మణాది నాల్గుజాతులతో నొప్పుమానిసు లుందురు. వీరందఱు బ్రహ్మస్వరూపులఁ బూజించుదురు. కుశేశయము, హరి, ద్యుతి మంతము, పుష్పవంతము, మణిద్రుమము, హేమకూటము, మందరం, బనెడుపర్వ తంబులుండును. ధూతపాప, శివ పవిత్ర సమ్మతి, విద్యు, దంభ మహియను పేరులతో నొప్పు నదులుండును. ఈ కుశద్వీపంబుమధ్య కుశస్తంభ మొప్పియుండు. ఇది నేతిసముద్రముచేత సమావృతంబై యుండు. క్రౌంచద్వీపంబు తద్ద్విగుణంబు, దధిసముద్రసమావృతంబిద్ది క్రౌంచము, వామనము, అంధకారకము, దివావృతి, మనస్సు, పుండరీకము, దుందుభి యను వర్షంబులతో నొప్పియుండు. గౌరి కుము ద్వతి సంధ్య రాత్రి మనోజవ శాంతి పుండరీక యనునదులు శుభోదకంబులు ప్రవహించుచుండును. నిందు సువర్ణశోభితంబులగు వర్షశైలంబులందు దేవగణంబులు బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులుందు రిందు యోగియగు రుద్రుండు పూజింపబడుచుండును. క్రౌంచంబనుపర్వతం బిద్దానిమధ్యనుండుట నిది క్రౌంచ ద్వీపంబనంబడు నిందు శాకద్వీపము శాకవృక్షాధిష్ఠితంబు పూర్వద్వీపంబుకన్న ద్విగుణంబు, క్షీరసముద్రసమావృతంబు. ఇం దుదయగిరి, జలధార, మస్త గిరి, అంబికేయము, కేసరి, శతకేసరము, దేవయానంబనెడు పర్వతంబులును, సుకు మారి, కుమారి, నలిని, వేణుక, యిక్షు, రేణుక, గభస్తి యను నదులును జెలు వొందు నాల్గుజాతుల మనుజులుందురు. ఇందు భగవానుండగు సూర్యుండు పూజింపబడుచుండును. పాలసముద్రం బన్వలఁ బుష్కరద్వీపంబుండు పూర్వద్వీపం బుకన్న నిది ద్విగుణంబు. శుద్ధోదకసముద్రసమావృతం బిందు మధ్యంబున హేమ పుష్కరం బొప్పుచుండు నట్లగుటన్ జేసి యద్ది పుష్కరద్వీపం బనంబడు నాకాం చనమయ శేశయము బ్రహ్మదేవునికి నివాసంబు ఈద్వీప మధ్యమందు మానసోత్త రంబను పర్వతంబుండు నిది పూర్వాపరంబులనుండు వర్షంబులకు మర్యాదపర్వ తంబుగ నుండు. మఱియు నా మానసోత్తరపర్వతంబు చివర సూర్యరథచక్రంబు

నిరంతరంబు మేరుప్రదక్షిణంబు సేయుచు నహోరాత్రంబులం దనరం జేయుచుండు. ఇందు దివ్యులు పద్మాసనుని బూజింపుచు రుగ్జరా దుఃఖ రాగ ద్వేషాధర్మంబులు లేక పదివేలసంవత్సరంబులు జీవింతు రిట్లు సప్తద్వీపంబులతోం బర్వతంబులతో ధాత్రీమండలంబు పంచాశత్కోటివిస్తీర్ణంబై విరాజిల్లు నిట్లు భూగోళంబు తెలియం గలింగించితి నింక భగోళంబుతీ రెఱింగింతు వినుండు. 140

## —* భ గో ళ ము *—

క॥ ఇలపైని లక్షయోజన, ములపై రవిమండలంబు ♦ పొలుపెసఁగుచు న
వ్వలను బయి లక్షయోజన, ములమీఁదన్ జందురుండు ♦ మురువుగనుండున్.

గీ॥ వెలయునటుపయి నొకపది♦వేలయోజ, నములపై ఋక్షములు దీప్త♦లమర నట్టి
తారకామండలముపైని♦దనరుబుధుఁడు, బుధునకు నూర్ధ్వంబునందుఁగా♦వ్యుఁడుడనరు

క॥ ఆకావ్యున కూర్ధ్వంబున, నాకుజుఁ డుల్లసిలు నింక ♦ నంతకుమీఁదన్
శ్రీకరుఁడైన బృహస్పతి, జోకగఁదనరారు నతులు ♦ శోభలు దనరన్. 143

గీ॥ అందుపైని శనైశ్చరుం♦డమరియుండు, నొనర నాతనిపై లక్ష ♦ యోజనములు
పైని సప్తర్షిమండలి ♦ పరిఢవిల్లు, నందుపై లక్షయోజనా ♦ యామమందు. 144

క॥ ధ్రువుఁ డుండు నాతనికిన్పై, రవికాంతుల మీసడించు ♦ రమ్యాతిరమ్యంపూ
భువనము చెలువొందు నజో, ద్భవులగు సనకాదులందు ♦ భాసిల్లుదు రొగిన్.

వ. ఆపైని జనలోకంబు వెలయు నందుపై రాజు లుల్లసిల్లుచుండు రద్దానిపైఁ దపో లోకం బలరు నందుఁ దపస్వు లుందు రటుపైఁ గనుదన్యస బ్రహ్మలోకం బుండు నద్ది భూలోకంబున కెనిమిదికోట్ల యోజనంబులపై నలరు. 146

గీ॥ అందు బ్రహ్మాణితోఁ జతు♦రాననుండు, వేదఘోషంబు లలరుచుఁగ ♦ వెలుఁగుచుండు
నదురుగా నట కెన్మిది♦కోట్లయోజ, నములపై నుండు [illegible] ♦ నగరభూమి.

క॥ అందున నిందిరతో సర, విందాక్షుఁడు పార్షదోఘ ♦ బృందంబులతో
డం దనరియుండు నచ్చో, టం, నుందుటు చెలువొంద [illegible] ♦ [illegible]ముఖుగడుక్.

వ. అచ్చోటికిం బదియారుకోట్ల యోజనంబులపైని మహాకైలాసం[illegible]డు. అద్దాని పైని వేఱొండు లేదు. 149

గీ॥ ఇందు బాలేందుమౌళి మ♦హేశ్వరుండు, అమ్మహేశ్వరితో [illegible] ♦ మ్మలరుచుండు
కోట్లకొలఁదిగఁ బ్రమథులు♦గూర్మిసేన, లాచరించుచునుందురు ♦ నాగు[illegible]మొనవ.

వ. ఇఁక నందు ముక్తిత్రియంబునొందిన మాహేశ్వరులు సంతతం బీశ్వరుల సాన్నిధ్యంబందుండి యవ్వారిం గొలుచుచుండు రద్దానికి సవ్యభాగంబులి సమీపంబున గోలోకంబం దాలం బాలించుచు రాధాసనాథుండు కృష్ణుండు వసించి నిచ్చలు గోక్షీ

రంబులఁదెచ్చి మహేశ్వరుని కర్చించి యర్చించి మహేశ్వరానుగ్రహంబుఁ బడయుచుండు నిది భగోళస్వరూపం బిఁకను మహీతలంబున కర్వాక్ప్రదేశంబగు పాతాళంబుఁగూర్చి చెప్పెద వినుండు. 151

—* పా తా ళ ము లు *—

క॥ వసుమతి కధస్స్థలంబున, నెసఁగును పాతాళ మట ను♦పేంద్రునియంశం
బన స్ఫురుఁ సురగేంద్రుఁడు తల,ల సుమంబులవలె జగంబు♦లక్ దాల్చుమునుల్ !

గీ॥ మణివితతిరంజితాయత♦ఫణిసహస్రముల ననలసంయుతశ్వేత♦భూధ్రమట్లు
శేషుఁడు స్ఫురమనుండు న♦శేషసుగుణ,భూషితుండయి పాతాళ♦భూమియందు.

క॥ మఱియున్ బడిగెలబారుల, విరిదండలఁ జాలఁదాల్చి ♦ విష్ణుపదీవి
స్ఫురితరజతాద్రిఁ బోలుచుఁ, గరమలరెడు దండధరాక♦ఘనుఁ డచ్చోటన్. 154

గీ॥ పొంకమగు స్తనతటిఁ జిఱునిదురఁ♦బోలి మెఱయు, నాగకన్యలు గొలువ నా♦నందముగను
బ్రహ్మదేవుని యనుమతిఁ♦బట్టి యెపుడు, భువనముల నెల్లఁ దలలను♦మోయుచుండు.

క॥ కడుభయదమగు విషాగ్నిన్, గడుకొని బుసకొట్టుచుండుఁ ♦ గద్రూతనయుం
డడఁగుచుఁ గల్పాంతంబుల, వెడలిచి యవ్విసము భువన♦వితతిన్ గాల్చున్. 156

వ. మఱియు.

గీ॥ మహిత భుజాగ్రిత స్రగ్రజు గ్రగ్ర ♦సుహితుఁడాతఁ, డెప్పుడే నావలించిన♦నీయిలాత
లంబు కాననగిరి శైలములతోడఁ, జలన మొందెడుఁ బ్రజలెంతొ♦యులుకుఁజెంద.

వ. ఇఁకనీ పాతాళంబులు పదివేల యోజనంబుల విస్తారంబుతోఁ గ్రిందుగఁ గ్రిందుగ, నతల వితల సుతల రసాతల తలాతల మహాతల పాతాళంబులను పేరులతో నేడు లోకంబులుండును. 158

క॥ ఈయవి రత్నప్రాసాదాయతములు హేమభూము♦లతిసుఖదంబుల్
పాయక యుందురు వసించెన, నాయసురవరేణ్యులు పన♦నాశనజాతుల్. 159

క॥ రాఁడిటకుఁ దినుఁడును శశి, రాఁడిటకు గ్రహంబు లుడులు♦రావిఁక నెపుడున్
బోడిమిని మెఱఁగ మణులే,జాడను వెలుఁగును దనర్చు ♦ సంబరమొసఁగన్.

వ. మఱియు నందు

క॥ వనములు పుంస్కోకిలరుతి, ఘనములు కాసారములు వి♦కచపద్మ సుజీ
వనములు శాశ్వతయౌవన, ధనవతు లందంబు మించు ♦ తన్వీశ్రేష్ఠల్

గీ॥ భక్ష్యభోజ్యాన్న పానముల్♦బహువిధములు, జాళువాపట్టువస్త్రముల్♦సౌరభమున
నొప్పు లేపనములు తావి♦పుష్పములును, రవలసొమ్ములు నింటింట♦రాసులొప్పు.

వ. వెండియు వీణావేణుమృదంగసంగీతనాదంబు లెంతేనియు సంతసం బొసంగ సిద్ధ
పూరుషులు దానవులు కాద్రవేయు లచ్చోట సుఖంబు లనుభవించుచుందురిట్లధో
లోకంబుల స్వరూపంబు నేర్పడ జెప్పితి నిక నెల్లధర్మంబులందు స్త్రీరక్షణం
బవసరంబు. స్త్రీరక్షణం బొనర్చకొనకున్న సర్వారు చెడి సంకరంబొనర్చెద
రట్లు గావున ముమ్ముందు వారల మనంబెఱుంగుట కర్జంబగుట నద్దాని దేటంబ
ఱతు వినుండు. 163

క॥ నారదుఁ డొక్కపు డచ్చర, యారామను బంచచూడ ♦ సరుస మ్మొసరన్
జేరి యడిగె స్త్రీమానస, చారిత్రంబును నెఱుంగు ♦ చక్కటి సంతిన్. 164

—* పంచచూడ స్త్రీస్వభావము నారదమునికిఁ జెప్పుట *—

గీ॥ పంచచూడయుఁ గేల్మోడ్చి ♦ పలికె నిట్లు, మునికి దేవర! నేనును ♦ బోట్టినై యె
ట్టులవచింపుదుఁ బొలఁతుల ♦ తెలఁపుపోలుపు, నాయమగునో గ్రాణి! యత్యద్భుతం ♦ పంబునాకు.

చ॥ అనవుడు మౌని యిట్లనియె ♦ నచ్చర లేమగ నాతిమిన్న! బోం
కును వచియింప దోసమగుఁ ♦ గూడ దటుల్ నిజమానసస్థమున్
వినిచిన నేర మెట్లొనరు? ♦ వేగమె చెప్పుము నీముఖంబునన్
వినఁగఁ దలంచినాఁడ నిటు ♦ నెగ్గలమైన కుతూహలంబునన్. 166

క॥ అనుటయు నారదమౌనికి, వినయమ్మున స్త్రీల తెఱఁగు ♦ వినిపింప మన
మ్మునఁబూని చారుహాసిని, యనియె నిటుల్ చెపుదువిను మ ♦ హాత్మ! ముదమునన్.

గీ॥ మంచికులమునఁ బొడమిన ♦ మానినులును, రూపవతులును నాథుని ♦ ప్రాపుగలుగు
వార లుచితంపుమర్యాద ♦ మీఱుదురిదె, స్త్రీలయందలి దోసంబు ♦ శిష్టచరిత!

క॥ విను మువిదకన్న లోకం, బున బాపపుఁ బ్రాణి లేదు ♦ మునికులతిలకా!
కనఁగ సకలాఘములకున్, వనితయె మూలం బరసిన ♦ వాఁడవు నీవున్. 169

గీ॥ చేడియలు దమ్ము వాంఛించి ♦ నేనఁ జేరు, వానిఁ గోరుదురేగాని ♦ వానిఁ గలసి
క్రీడసేయుదు రొడరు ♦ కిల్బిషముల, కించుకేనియు వరుసను మౌ ♦ నీంద్ర! మదిని.

చ॥ నెఱపున నేని వంగడపుఁ ♦ బేరమి గౌరవ మొందియేని బల్
సిరిఁ గనియేని సాధుమది ♦ చేష్టలు సంచనియేని మానినీ
తెఱవలు గాముకాత్మలయి ♦ తెంపున నెవ్వని నేని గాంచినన్
మరగి సుఖింతు రిందు సను ♦ మాన మొకించుక లేదు సంయమీ! 171

క॥ మగనియు బావల మఱఁదుల, బుగులునునున్ బరిజనములు ♦ బుగులున మదికిం
దగుపురుషులు సేకూరమి, మగువలు మగనికడనుందు ♦ రిటియాపయెయిన్.

క॥ వీరికిఁ జోరరాసిది యెం, దారయఁగా నొసర దగ్గ ♦ సను నేతెన్
మీఱిచనుచుందు రేపున, జారునిఁ జేరంగఁ దాప ♦ సకులవతంసా! 173

సీ॥ ఎడపక యొకనెల ♦ నెడమహస్తంబు కం, పంబును నొకతీరు ♦ నడఁచెనేని
దవడలున్ గొంతు కెం♦పయును దడిన్ మాలి, మించువైఖరిని శో♦షించెనేని
తన నీడయందు మ♦స్తకము గన్పట్టక, దురుసున మొండెంబు ♦ దోఁచెనేని
కాకమేనియు విహం♦గంబేని యలకపో, తంబేనిఁ దలయెక్కి ♦ తాఁకెనేని

గీ॥ కారణములేక మాక్షిక ♦ గణము దన్నుఁ, జేరి పరివేష్టనంబున ♦ వ్రాలెనేని
అట్టిమనుజన్ముఁ డొకనెల ♦ యందె జముని, ప్రోలికేఁగఁగలం డిందు ♦ బొంకులేదు.

గీ॥ పట్టపగటను నుల్కాభి ♦ పాతనంబు, నడికిరేయిని నింద్రధ ♦ నుస్సుఁ జూచె
నేని వాఁడాఱునెలలలో ♦ నినతనూజ, సన్నిధికిఁ జేరు లేదింక ♦ సందియంబు.

వ. మఱియు నింకను ఛాయాపురుష స్వరూపంబుఁ గూర్చి చెప్పెదను వినుము. 178

— * ఛాయాపురుష దర్శన ఫలభేదములు * —

క॥ ఇనునైనను శీతలకర, శిఖినైనను వెనుకఁ జేసి ♦ సితపటధరుఁడై
మనమున దైవముఁ దలఁచుచుఁ, దనఛాయను జూడవలయు ♦ ధారాధరరో!

వ. అందు శిరోవిహీనంబైన నాఱుమాసంబులలో మృతిఁ జెందు. 189

గీ॥ ధవళమైనను నాఛాయ ♦ ధర్మమొందుఁ, గృష్ణమైనను నాఛాయ ♦ కల్మషంబు
శోణమైనను బందిలోఁ ♦ జొచ్చుఁ బీత, మైనఁ గలహంబు వాటిలు ♦ నగధరారి!

చ॥ మఱి విభుఁ డంధుఁ గాఁ దనర ♦ మ్రింగుడు శిష్టపుబంధువుల్ పెఱుగం
బొఱఁగిన క్షుద్భయంబు గటి ♦ యుక్ గనుపట్టక యుండెనేనియుక్
సుతుఁ గును భార్య జంఘ లటు ♦ చొప్పడకున్న ధనంబు పోయెడున్
జరణములుక్ గనన్ బడని ♦ చంపమునన్ బరదేశమేఁగునున్. 191

క॥ అనుటయుఁ బార్వతి శర్వున, కనియెను మరణంబుఁ దెలియు ♦ సరణివిధముఁ జె
ల్పినయట్టులె సాంప్రతమున, ననఘా! మృతిఁ గల్గుజాడ ♦ నానతి యిమ్మా!

క॥ అనుడున్ శంకరుఁ డగజకు, ననె దేవీ! సర్వజనహి ♦ తార్థినివై యి
ట్లనువుగ నడిగితి వెంతయు, విను మింక నెఱిఁగింతు యోగ ♦ విద్యాసరణిన్.

వ. పృథివ్యప్తేజోవాయ్వాకాశంబులు పంచభూతంబు లేతత్స్వరూపంబగుటఁ బాంచ
భౌతికంబగు శరీరంబు. అందాకాశంబు సర్వవ్యాపియై యుండు. సర్వం బాకాశ
మందు లయించు. 194

క॥ ఎద్దాని వియోగంబున, నొద్దిక భూతంబులెల్ల ♦ నొందెడు స్వపదం
బద్దాని సన్నిపాతము, నెద్దేవుఁడు స్థిరముగాఁగ ♦ నేర్పడఁ జెప్పన్. 195

వ. జ్ఞానులగువారు తపోమంత్రబలంబుల నిది యంతయు నెఱుంగుదురనిన బరదేవి
మహేశ్వరున కిట్లనియె.

గీ॥ దేవ! మును ఘోరరూపుఁ డా ♦ దివ్యమూర్తి
కడుఁ గరాలుండు కాలుండు ♦ గర్వమణఁగ
నీదు శూలహతిఁ జేసి ♦ నిహతుఁడై మ
రల భవదనుగ్రహంబున ♦ బ్రతుకుఁ గాంచె. 197

క॥ పొరిఁబొరి నిను సంస్తుతులన్, మఱిమఱి సంతోసపెట్టి ♦ మరలఁ దనదియౌ
నురవగు నధికారముఁగొని, పొరిగొనుచుండెను యథేచ్ఛ ♦ భూతవితతులన్.

వనమయూరము: అక్కట తన దేవర! ద♦యామతి యెసంగన్
దిక్కఱి మృతిన్ గొనెడు ♦ దీనులను నెంతేఁ
జక్కఁగని చెప్పు మిఁక ♦ సాయమగు మార్గం
బెక్కరణిఁ గాలుని జ♦యింతురొ మహాత్మా!

## —* మృత్యుంజయ యోగములు *—

వ. అనిన మహేశ్వరుండు.

గీ॥ ధ్యానపరులైన యోగు లె♦ట్టాననేని, పంచతను జెంద రిద్ది ధ్రు♦వంబు వారు
కాలునిన్ గెలుచుట కెందుఁ♦జాలువారు, రమ్యతరగాత్రి! పర్వత ♦ రాజపుత్రి!

వ. ఆయోగంబును జెప్పెద.

క॥ హిమకరవదనా! చెప్పెద వినుము మేదురయోగవిధము♦నున్ సులువుగ భూ
తములైదు తద్గుణములును, నమరగ దేహంబు జనన♦మగు నిలలోనన్. 201

గీ॥ ఆకసంబున వాయువా ♦ యనిలమునను, నగ్ని యద్దాన నుదకంబు ♦ లాజలములఁ
బృథ్వి జనియించు వినుము వి♦భీతహరిణ, నయనరో! విలోమగతిన ప్ర♦లయముఁ జెందు.

క॥ ఇల నైదు గుణంబులతో, సలిలము నాలుగుగుణముల ♦ జ్వలనుడు మూటన్
జెలువుగ రెంట సమీరం, బలయంబర మొక గుణమున♦నలరెడు సాధ్వీ! 230

వ. శబ్దస్పర్శరూపరసగంధంబులనెడు నీగుణంబులెపుడు భూతంబులఁ బాయునో నపు
డవ్వి విపన్నంబులగును. అందువలనఁ గాలజిగీషుండగు యోగిచే శబ్దాది గుణం
బులు స్వస్వకాలంబందుఁ జింతనీయంబులు.

క॥ దేవి! రహస్యముఁ జెప్పెద, నీవిఁక నిద్దాని భక్తి ♦ నిరతుఁడును గడున్
బావనుఁడు శ్రద్ధధానుం, డౌ వానికిఁ జెప్పు వలవ♦దన్యున కెపుడున్. 305

గీ॥ రాత్రులందున దీప వి♦రహితమైన, యంధకారమునన్ జను♦లందఱును ని
దురను జెందుచున్నప్పు♦డరసి సెజ్జ, యందుఁ గూర్చుండి సుశ్వాస♦మమరుచుండ.

వ. యోగంబు సల్పవలయు నది యెఱింగింతు వినుము.

త్ఓంకారమును బాగుగా నభ్యసింపవలయును. ఈ ప్రకారమభ్యసించినయెడల యోగి పాపంబులఁ జెందడు. యోగపరిపాకమొందిన మృత్యుజిత్తగును. ఈనవ విధముల ఫలితంబుఁ జెప్పెద నాలకింపుము.

సీ॥ ఘోషమొప్పఁగనాత్మ♦కున్ శుద్ధిదము రోగ, హరము వశ్యాకర్ష♦కరమునగుచు
కాంస్యనాదము ప్రాణి♦గతుల నిరోధించు, భూతంబులను గ్రహం♦బులను నెట్టు
సతి! శృంగరవ మభి♦చారిశాత్రవజనో, చ్చాటనమారణ♦ సాధకంబు
ఘంటానినాద మా♦కర్షణంబొనరించు, నైలింపసిద్ధ క♦న్యలకు నేని

గీ॥ ఇఁకను వీణానాదమ్ము ద♦త్వొందు నేని, బరఁగువానిఁ గనంజేయు♦ వంశనినద
మఖిలతాత్త్విక సిద్ధిని♦ నమరఁజేయు, దుందుభిధ్వానము జరామృ♦తులను బాపు.

క॥ విను శంఖనాదమున భు, వనములనెల్లను జరించు♦ వలతియగుఘనా
ఘనగర్జనమున నాపద, లను బాయు మతెట్టిదైన♦ లలితాంగి! ధరన్. 220

వ. ఇఁకను.

ఆ॥ ఏకచిత్తమొంది♦ యెంతయుబ్రహ్మరూ, పంబుగాఁదనర్చు♦ భవ్యమైన
యనుపమంబునైన స♦యల్ల త్ఓంకారంబు, విన నసాధ్యమొకఁడు♦ నెలయ దెందు.

గీ॥ మఱియును సర్వశ్రోత సర్వజ్ఞ♦నుండనుఁడును, సర్వదర్శియునై యింక♦ సర్వలోక
సంచారుడునగుచరించు వి♦కారనములను, బెంపఁజొక్కింతయాతఁడు♦ శివసముండు.

వ. పరమేశ్వరి! యిట్లు శబ్దబ్రహ్మస్వరూపంబులఁ దెలియంగించితి నీకేమి వినవలెంచెదవన నప్పరమేశ్వరి యిట్లనియె. దేవా! యోగమార్గంబు ననుసరించి ప్రాణాయామంబొనర్చినయెడల కాలుని జయింపరెందు రద్దాని నెఱుంగఁ జెప్పుమన్న శంకరుండిట్లనియె. 223

క॥ దేవి! చెప్పెద వినుమింక, పావనమగు యోగమర్గ♦ ప్రాణాయామం
బేవాఁడొనరించు మాసార్థముఁ, దా విడువక చేయు మిత్తి♦ నోటఁగలఁడిలన్. 224

వ. పవనధారణంబున జ్ఞానవిజ్ఞానంబులు నుత్సాహమును బ్రవర్తించును. 225

గీ॥ ఎవఁడు పవనంబును జయించి♦యెసఁగు నట్టి, వాఁడు సర్వజగజ్జయ♦భాగ్యమొందు
నిల జరామృత్యువులను జ♦యింపఁ బ్రాణ, ధారణధ్యానపరుఁడయి♦తనరవలయు.

గీ॥ లోహకారుఁడు భస్త్రిక♦లోన గాలి, నెట్లునిండించి తన పను♦లెసఁగఁజేసి
కొను నట్లు యోగియగువాఁడు♦కూర్మిమీఱ, పవనధారణమభ్యసిం♦పంగవలయు.

గీ॥ వ్యాహృతిపురస్సరముగగా♦యత్రిమనువు, రహిశిరసుతోడనాయత♦ప్రాణుఁడగుచు
మూఁడుమారులుదాజపం♦బునునొనర్ప, వలెఁద దేకాత్ముఁడగుచుఁబు♦వ్వారుఁబోఁడి!

ఆ॥ వాయవీయతత్త్వ ♦ వరయోగ మీయది, పరమయోగిజనుల ♦ భాగ్యలక్ష్మి
గ్రహము లర్కశశులు♦గ్రిచ్చ అమరలుదు, రెపుడు మరలఁడతివ! ♦యీసుయోగి.

క॥ నూతేండ్లు విమలతరకుశ, నీరముఁగ్రోలుచుఁ దపించు ♦ నేర్పరికిఁగడున్
జేరెడు సుకృతఫలంబది, చేరుఁబవనధారణంబుఁ ♦ జెందెడుకృతికిన్.

వ. వెండియు నెవఁడు మాంద్యముఁబాసి యేకాంతమందుఁ బ్రాణాయామం బొనర్చునో యవ్వాఁడు ముసలితనమును రోగంబును మిత్తినిగెల్చి వాయుగమనంబున ఖేచరత్వమొందును మఱియు సిద్ధరూపంబుఁజెంది కాంతిని మేధను బరాక్రమంబును శౌర్యంబును గాడ్పుతోఁదుల్యంబగు గమనంబును సుఖంబుగఁ బొందునిఁకఁ బెక్కు లేల? యేబాపఁ డుదయమునలేచి ప్రాణాయామం బొనరించునో యవ్వాఁడు బ్రహ్మలోకంబునుజెందు నిందు సందియంబులేదిట్లు వాయుసిద్ధినిఁ జెప్పితినిఁకఁ దేజంబువల్లనగుదానిన్ జెప్పెదువినుము. జనులెల్ల నిద్రించియున్నపుడు దీవియ లేని యంధకారంబందు సుఖాసనంబునఁ గూర్చుండి భ్రూమధ్యమందుఁబ్రకాశించు వహ్నిజ్యోతినిఁజూడవలయు నిది భ్రూచరీముద్రాయోగము. మఱియుఁ జేతివ్రేళ్ళతోఁ గన్నుల నించుకపీడించి సగము ముహూర్తమేకధ్యానపరుఁడై వెలుంగు జ్యోతినిఁ జూడఁదగుఁ దెల్లనై యెఱ్ఱనై నల్లనై చిత్రవర్ణమైయొప్పు నిది ఖేచరీ ముద్రాయోగము. 231

గీ॥ కనుబొమలమధ్యయం దలి♦కంబునందుఁ, బరఁగుబాలార్కతేజోవి♦భాసురమగు
జ్యోతిఁగనుచున్నపురుషుఁడు♦సురుచిరేష్ట,గాత్రమును జెందునిఁకఁబర♦కాయమొందు.

వ. మఱియు నణిమాదిసంపన్నుండై దూరదర్శన దూరశ్రవణజ్ఞానవంతుండై బహురూపధారణసామర్థ్యంబును ఖేచరతాసిద్ధినిఁ బొందు నిఁక వేదాధ్యయన సంపన్నులును నానాశాస్త్రవిశారదులును నగువారు సంతతము పూర్వకర్మవశంబున మోహంబుఁ బాయలేరు, 233

గీ॥ కనుచుఁ గనలేరు వినుచును♦వినఁగలేరు, పాపమోహితులై యంధ♦బధిరులట్లు
తమమునకుదొలనున్న యు♦త్తమపవన,నామహాపురుషునిఁ దెలి♦యంగఁజెల్లు.

ఆ॥ విను సహస్రశీర్షుఁ♦డును సహస్రాక్షుఁడు, నున్ సహస్రపదుఁడు♦నునయి యొప్పు
నల పురుషుఁడు విశ్వ♦మందు దశాంగుల, సీమనావరించి♦చెన్ను మీఱు. 235

వ॥ ఇఁక భూతములలో నాలవదగు నుదకభూతంబున నగు నమరత్వంబును జెప్పెదను వినుము. నియతమనస్కుండై యోగి సుఖాసనంబునఁ గూరుచుండి సమున్నత శరీరుండై కూర్పఁబడిన కరపుటములుగలవాఁడై చంచువునుఁబోలిన ముఖంబున మెల మెల్లగ గాడ్పుఁబీల్చుచుఁ దాలుమూలంబులనుండి జీవదాయకములై స్రవించు నుదకంబులఁ గ్రోలుచుండవలయు నవి శీతలంబు లమృతజలంబు లిట్లు వీని

నిత్యంబు గోరిలువాఁడు మిత్తినిఁజెందఁ డాకలి దప్పుల గెల్చి మహాతేజస్కుఁడై దివ్యకాయుండగును మఱియును. 236

గీ॥ ఏనుఁగువంటిబలంబు హరీంద్రుమట్టి, వేగము సుపర్ణువంటిమేల్ ♦ వీక్షణంబు
గలిగి కృష్ణకచములొప్పి ♦ పొలుచుదేవ, గురునిభుండయి దివ్యవత్సరశతంబు.

వ. ఇఁకను నొకవిధంబుఁజెప్పెదనువినుము రహస్యము. యోగియగువాఁడు నాలుకను దనడలనువంచి కొంచెముకాలముంచవలయు నట్లైనఁ గ్రమమున లంబికాయోగ మును జెందును. అటుమీఁదఁ బ్రసరించు చల్లని జలంబును సుధనుబోలెఁ ద్రాఁగినయెడల నమరత్వమునుజెందును. ఇట్లు తపోవ్రత నియమయోగాపథము లచే ధర్మవిదులును నయవినయయుతులగువారు మిత్తిని గెలువవలయు నిట్లు నీవడిగినవానిఁ దెల్పితినని శివుం డుమతోఁ జెప్పెనని సూతుండు మునుల కెఱింగిం చిన నవ్యాసు మహాత్మా! మన్వంతరంబులను దద్వంశంబుల నెఱింగింపు మను టయు సూతుం డిట్లనియె. 238

## ప్రతిసర్గము - మన్వంతరంబులు - వంశములు - తదనుచరితములు

క॥ ధ్రువుని సమున్నతపదవీ, నివేశితు నెఱుంగఁ జెప్ప ♦ నే? మును మీఁకున్
సువిహితుఁ డాతఁడు పెక్కేం, డ్లవనిఁ బాలించె విబుధు ♦ లందఱు మెచ్చన్.

క॥ ఆ విభునకు సుతు లిద్దఱు, పావనులగు పుష్టి ధాన్య ♦ భాసురనాముల్
(శ్రీ) పెలయఁగఁ బుష్టికి సుతు, లావిర్భావంబుఁజెంది ♦ రైదుగురు తగన్. 240

వ. రిపుఁడు రిపుంజయుండు విప్రుఁడు వృకలుఁడు వృషతేజుండు ననువారు. 241

క॥ సుగుణయుతుఁడగు రిపుం డుత్తముఁ, డురుగుణనిధియైన నాతఁ ♦ డొక గుహ్యకుచే
దురమునఁ జంపంబడె నా, పరితాపంబున జననియుఁ ♦ బంచతనొందెన్. 242

వ. ధ్రువపౌత్రు లైదుగురలో జ్యేష్ఠుఁడగు రిపునకుఁ బుష్కరిణియందు సర్వతేజుం డను సుతుండు పొడమె నవ్వానికిఁ జాక్షుష మనువు జన్మించె ఆ మనువునకు నడ్వలయందుఁ బురువు, మానసము, శతద్యుమ్నుఁడు, తపస్వి, సత్యజిత్తు, కవి, అగ్నిష్టోమాతిరాత్రులు, అతిమన్యువు, సుయశుఁడు ననువారు పదిమంది కొమ రులు జన్మించిరి. అందుఁ బురువున కాగ్నేయియందు నాలుగురు కొమరు లంగుఁడు, సుమనుఁడు, ఖ్యాతి, క్రతు వాంగీరసుఁడు, గయుఁడు ననువారు జన్మించి రందు నంగునకు సునీథ యను ధర్మపత్నియందు దుష్టచేష్టుండగు వేనుండు పొడమె.

క॥ తనయుని చెడునడతలకున్, మనమునఁ గడు రోసి యంగ ♦ మనుజవిభుఁడు గా
ననుబడి యెందునసేనియుఁ, జనియెను జిత్తం బొకింత ♦ శాంతిన్ జెందన్. 244

వ. అనంతరము.

గీ॥ రాజుగాఁ దనరిన వేనుఁడు ♦ వోజఁ దప్పి, చెడ్డచేఁతలఁ బ్రజల హిం ♦ సించుచుండ
దివ్యమును లందఱును జేరి ♦ తేఁకు వెసఁగ, నుగ్రులై చంపి రవ్వాని ♦ హుంకరించి.

వ. అటుమీఁద మునీశ్వరప్రార్థన చేతను నరాజకంబగు లోకంబుఁ గాంచియును దద్దుః
ఖంబుఁ బాపఁగోరి దివ్యమును లవ్వేనునికుడిభుజంబును మథించ నందు ధన్వియుం
గవచియు సూర్యతేజస్వియు నారాయణావతారంబగు పృథువు జనించె. 246

క॥ ఆతఁడు గడుధార్మికుఁడై, భూతలమును నేలెఁగడిమి ♦ పోలుపొప్పఁగఁ బ్ర
ఖ్యాతీతంబగు తేజము, ఖ్యాతియునుర్గ్రమ్మికొనఁగఁ ♦ గరిమనురక్షన్. 247

వ. మఱియు.

గీ॥ రాజసూయాహ్వయమహాధ్వరం బొనర్చి, నట్టి యుష్టలలో నీతిఁ ♦ డగ్రగణ్యుఁ
డశ్వమేధశతంబుల ♦ నమరఁజేసె, నర్చియను భార్యతోఁగూడి ♦ సౌఖ్య మొందియు.

వ. అమ్మహీనాథున కర్చియందు విజితాశ్వుఁడు, హార్యశ్వుఁడను వారలిద్దఱుపుత్రు
లుద్భవించిరి. ఆవిజితాశ్వునకు శిఖండిని యందుఁ బ్రాచీనబర్హియను వాఁడుపుట్టె.
ఆతండు సముద్రరాజసుతయగు శతధృతియనుకన్యం బెండ్లియాడె. ఆయనకు బహు
యజ్ఞకరుండగు ప్రాచీనబర్హినలనఁ బదిమందిసుతులు జన్మించిరి. ప్రాచేతసులనఁ
బడు నవ్వారు పితృాజ్ఞచే సాముద్రోదకంబందుండి రుద్రగీతంబు జపించుచు శివ
ధ్యానపరాయణులై పదివేలేండ్లు తపించిరంతఁ బ్రాచీనబర్హి యుష్యనింబునను నర
క్ష్యమాణయగు పృథివియందుఁ బ్రజాక్షయంబయ్యె నదికాంచి యుఁగతపమున్ను
దపఃఫలంబుఁజెందియున్న ప్రాచేతసులు నిజరాజధానిఁ జేరుచుఁ బుడమియందలి
వృక్షంబులెల్లఁ బెచ్చుపెరిఁగి మార్గంబులను నిరోధించి బ్రబలియుండుటఁగాంచి
యవ్వాని దహింపఁబూని ముఖమునుండి యగ్నిమారుతులఁ విడిచి సహస్రంబులఁ
గాల్చుచున్నఁ జూచి కొంతవడికి సోముఁడు వారిని దారసించి యిట్లనియె. [248]

ఉ॥ కాల్పకుఁడింక భూజములఁ ♦ గానన మీయుట దగ్ధమైయున్న విం
దల్పతరంబులౌ ద్రుమము ♦ లాయెడ నాయెడ నున్నవిట్టి లీ
స్వల్పములైనవాని నిఁక ♦ సంకఁడలంపుఁడు మన్యువేగముఁ
మల్పుఁడు వేగ మామకకు ♦ మారిక యిందు వసించుఁ గాంచుఁడీ ! 250

క॥ ఆకన్నియ వర్చస్విని, మీకదియగు ధర్మపత్ని ♦ మీరిఁక దానిఁ
జేకొని వివాహమొందుఁడు, జోకగ నాదత్తయాజ్ఞ ♦ సుతులన్గని పోలుచున్.

క॥ పదిమంది కెట్టు లాలగు, నిది యొకతుక యని మనమున ♦ నెంచంబోకుం
డిది దైవచోదితంబై, యొదవిన దన వారలట్లు ♦ లొడఁబడి చేర్మిన్. 252

ఆ॥ వృక్షజాతయైన ♦ వెలఁదిని వార్షినిఁ, బెండ్లియాడిరంతఁ ♦ బేర్మిదనర
వారి కాపెయందుఁ ♦ బ్రభవించె దక్షుండు, చాక్షుషాఖ్యమనువు ♦ సమయమందు.

వ. అతండు ప్రజాసర్గరతుండై మానసికసృష్టిన్ గూర్ప నయ్యది వృద్ధిగామిన్ జేసి బ్రహ్మచోదితుండై మిధునవిధువన ధర్మంబునఁ బ్రజావృద్ధిఁ బొనరింప నెంచి పరమేష్ఠిప్రసూతియగు నసిక్ని యనుదానిన్ బెండ్లాడియున్నంత నాపెయందు. 254

క॥ ఆ దంపతులకు నరువదుగురు, పైదలులు జనించి రధిక ♦ భాసురచరితల్
సౌదామినీప్రకాశలు, మేదురతరశేముషీస ♦ మీహితలు గడున్. 255

ఉ॥ వారలలోన ధర్మునకుఁ ♦ బద్గురఁ జంద్రున కిర్వదేడ్గురన్
ధీరుఁడు కశ్యపాఖ్యక ము ♦ నీమణికిన్ బదుమూఁగు రంగిర
స్సూనుఁ కిరువ్గు రా తార్క్ష్యునకు ♦ సొంపుగ భూతున కిద్ద ఱిద్దఱిన్
గోరి యొసంగె నిమ్ముకనిఁ ♦ గూఁతుల నల్వుర నిచ్చెఁ బ్రీతిమై. 256

వ. ధర్ముని పత్నులగు పదుగురు – భానువు, లంబి, కకుప్పు, జామి, విశ్వ, సాధ్య, మరుత్వతి, వసువు, ముహూర్త, సంకల్ప యను వార లందు భానువునందు సుతుండై ఋషభుండను పేరిమిన నవ్వాని కింద్రసేనుండు జన్మించె లంబియందు విద్యోతుండును మేఘంబు లుద్భవిల్లె. కకుప్పునందు సంకటుండుపుట్టెనతడు నవ్వానికిఁ గీకటుండు జనింప వానికి దుర్గాభిమానులగు దేవతలు జన్మించిరి. జామికి దుర్గాధిష్ఠానదేవతలు జన్మించిరి. వారికి స్వర్గుఁడు నందియునుం బుట్టిరి. విశ్వయందు విశ్వేదేవులు పొడమిరి. సాధ్యయందు సాధ్యులు జన్మించిరి. మరుత్వతియందు మరుత్వంతుఁడు (ఇంద్రుఁడు) జయంతుఁడునను వా రుద్భవించిరి. జయంతుండు విష్ణువగు నుపేంద్రుండు. ఇంక వసువు నం దయుఁడు ధ్రువుఁడు సోముఁడు ధరుఁ డనిలుఁ డనలుఁడు ప్రత్యూషుఁడు ప్రభాసుఁడు నను వారష్టవసువు లుత్పన్నులైరి. అందయునకు వైతండుండు శాంతుఁడు మునియనువారు కొమరులై పుట్టిరి. ధ్రువుండనువానికి కాలుండును సోమునకు వర్చుండును నవ్వానికి వర్చస్వియు ధరునకు ద్రవిణుండను వాఁడును, అనిలునకుఁ బురోజవుం డవిజ్ఞాతగతియు ననువారును నగ్నికి శరస్తంబమందుఁ గుమారుండు జన్మించెను నాతని శాఖలందు శాఖుండు విశాఖుండును బృష్ఠమందు నైగమేయుండును జన్మించిరి. ప్రత్యూషునకు ఋషియను దేవలుండు నవ్వానికిఁ క్షమావంతులు మనీషులు ప్రజ్ఞావంతులు పొడమిరి. ప్రభాసునకు విశ్వకర్మ జనియించె. ఆ విశ్వకర్మకు మనువు జన్మించె. ముహూర్తయందు మాహూర్తికులను దేవగణంబులును సంకల్పజుఁడగు కాముఁడును బొడమిరిక భూతునకును రూపయనునాప యందు రైవతాజభవభీమవామోగ్రవృషాకప్యజైకపాదహిర్బుధ్న్యబహురూపమహాత్ములను నేకాదశరుద్రులును రుద్రపారిషదులగు భూతగణంబులు నుత్పన్నంబులయ్యె నింకఁ గశ్యపున కదితి దితి సురస అరిష్ట యిల దను సురభి వినత చేల తామ్ర క్రోధవశ కద్రువు ముని యను పొలఁతులు పదుమ్గురు భార్యలైరి వారియం దదితికి వైవస్వత మన్వంతరంబునం దిందోపేంద్రులును

మఱియు నర్యముండు ధాత విధాత, త్వష్ట పూష వివస్వంతుండు సవిత మిత్రావరుణులు, అంశుండు, భగుండతితేజుండు నను పన్నిద్దఱు సహోదరులు జన్మించిరి.

ఆ॥ దితికిఁ బొడమిరి కను ♦ సుతులు హిరణ్యక, శిపు హిరణ్యాక్షుఁడను సుతు ♦ లు పొలుపమరు
సింహికయను సుతయుఁ ♦ జెలువొప్పు నా హిర, ణ్యకశిపునకుఁ బుట్టిరి ♦ సుతులు నలుగురిలను.

వ. అనుహ్లాద సంహ్లాద హ్లాద ప్రహ్లాదు లనువారలం దనుహ్లాదునకు సూర్మ్యయందుఁ బులోముఁడు మహిషుండును, హ్లాదునకు ధమనియందు వాతాపీల్వలులును సంహ్లాదునకుఁ గృతియందు బంచజనుండును, ప్రహ్లాదునకు విరోచనుండును జన్మించి రా విరోచనునకు బలియును నాతని కశన యను భార్యయందుఁ బుత్రశతంబు జన్మించె నందు జ్యేష్ఠుఁడగు బాణుండు శివభక్తాగ్రగణ్యుండై శివుని మెప్పించి తద్గాణాపత్య మొందె నికను. 259

గీ॥ ఆ హిరణ్యాక్షునకుఁ బుత్రు ♦ లైదుగురగు, నుగ్ర శకుని భూతసంతాప ♦ నులును గాల
నాభుఁడును బిరుదగు మహా ♦ నాభుఁడు నను, వారలెంతయు విక్రాంతి ♦ భూరిబలులు.

వ. సింహికను విప్రచిత్తి యనువాఁడు పరిగ్రహించె నిఁక దనువను నాపె కొడుకు లయోముఖుండు శంబరుండు కపోలుండు, వామనుండు, వైశ్వానరుండు, పులోముండు, విద్రావణుండు మహాశిరుండు, స్వర్భానుండు వృషపర్వుండు విప్రచిత్తి యను ముఖ్యులగువా రనేకు లుద్భవించిరందు స్వర్భానునకుఁ బ్రభయును కన్యకయును పులోమునకు శచియును వృషపర్వునకుపదానవిహయశిరశ్శర్మిష్ఠలును వైశ్వానరునకుఁ బులోమకాలకలును బొడమిరి. 261

సీ॥ ప్రభయనునామె చే ♦ పట్టె నాయువు మున్ని, శచిఁ గనెను జేపట్టె ♦ శక్రుఁ బ్రీతి
నలఁతి నుపదానవి ♦ యను హిరణ్యాక్షుని, బెండ్లియాడె హయశిర ♦ నేలెఁ గ్రతుఁడు
శర్మిష్ఠయు యయాతి ♦ జననాథు వరియించె, నిఁక బులోమయును గా ♦ లకయు మారీచిఁ
బెండ్లాడి రరువది ♦ వేలపుత్రులు వార, లగ నుద్భవించిరి ♦ ప్రకటబలులు

గీ॥ ఘనులు పౌలోములనువారు ♦ కాలకేయు, లనెడువారు సహస్రులు ♦ [illegible] చరితు
లా హిరణ్య పురంబున ♦ నధివసించి, యుండిరవ్వారు ప్రీతినిఁ ♦ [illegible].

వ. సింహికయందు విప్రచిత్తికి రాహుప్రముఖులగువారు పదుమువ్వురగు [illegible] జన్మించిరిఁక నుతామ్రియను కశ్యపపత్నికి. 263

క॥ కాకియు శ్యేనియు భాసియు, లూకియు గృధ్రియును శుకి ♦ యలరఁగ శ్వియునుఁ
జోకగు సుగ్రీవియునుఁ, బీఁకన్ జనియించె మిగుల ♦ వెలసిరి పుడమిన్. 264

వ. ఇఁకఁ గాకికిఁ గాకులును శ్యేనికి డేగలును భాసికి పోతులును నులూకికి గుడ్లగూబలును గృధ్రికి గద్దలును శుకికిఁ జిలుకలును అశ్వికి లొట్టిపిట్టలును గుఱ్ఱములు గాడిదలును సుగ్రీవికి శుభపక్షులును జన్మించె. మఱియు నిఁకఁ గశ్యపపత్నులందు

